# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4    [illegible] 16-9-1981    సంచిక 22


— ఈ సంచికలో —





1—10—81 సంచికలో ప్రబంధపరమేశ్వరుని ప్రతిభ, మొల్ల కవితాపటిమ, సమస్యాపూరణరీతి వైశిష్ట్యము, విశ్వనాథ నాయకుఁడు–నారాయణరెడ్డి కవితా వైశిష్ట్యం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా :

సంవత్సరమునకు రు. 12—00.

అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.


## ధూర్జటి - రచనా శిల్పము


— శ్రీ ఎస్. ఎన్. సి. తిరుమలాచార్యులు.


ఆంధ్రవాఙ్మయ సుక్షేత్రమున పండిన బంగారుపంట ప్రబంధము. కావ్య ప్రబంధములు రెండును సమానార్థకములే అయినను, శ్రీకృష్ణదేవరాయల కాలమున వెలసిన గ్రంథములు మాత్రమే ఆంధ్రసాహిత్యమున ప్రత్యేకముగ ప్రబంధముద్రను దాల్చినవి. శ్రీకృష్ణదేవరాయల యుగమును (ప్రబంధయుగమును) స్వర్ణయుగమనుటలోనే ఈ ప్రబంధములకు ఆంధ్ర సాహిత్యమున ప్రత్యేక గౌరవస్థానము లభించినది.

ఈ ప్రబంధములందలి యితివృత్తములు సంస్కృత పురాణేతిహాసములనుండి గ్రహింపబడినవే అయినను, ఆంధ్రకవులు మూలకథలను రసానుకూలముగ మార్చుకొని, స్వకపోల కల్పనలతో విస్తరించి, అష్టాదశ వర్ణనలతో నలంకరించి వర్ణనాప్రధానముగా స్వతంత్ర కావ్యములుగా తీర్చిదిద్దిరి. ఇందు మనుచరిత్రాది ప్రబంధములు శృంగార రసప్రధానములు కాగా, ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, భక్తిరస ప్రధానములై తక్కినవానికంటె విలక్షణము లగుచున్నవి.

ఇందు ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యమున చంద్రోదయ వర్ణనాపరముగా ప్రదర్శించిన రచనా శిల్పమును పరిశీలింతము.

'కవయతే వర్ణయతీతి కవిః' అను ఆలంకారిక సూక్తి సాహిత్యజగత్తులో ప్రసిద్ధము కదా! అనగా వర్ణించువాడు కవి యని యర్థము. ఆ వర్ణన ప్రకృతి యైనను కావచ్చును. లేదా మానవసంబంధియే కాక సకల ప్రాణికోటి మనఃప్రకృతి యైనను కావచ్చును. ఈ వర్ణనలు పాఠకులకు పఠనవ్యగ్రతనుండి విశ్రాంతి నొసగుటకే అయినను వర్ణన వర్ణవకొఱకు గాక, కథకు అనుకూలముగాను, కథాసూచకముగాను, ఔచిత్యవంతముగాను నుండవలయును. కవి ప్రతిభా వ్యుత్పత్తులకు వర్ణనములే నికషోపలములు. ఈ లక్షణములు ధూర్జటి వర్ణనములలో కలవు కావుననే యితడు కవులలో మహాకవి. ఈతడు రచించిన చంద్రోదయ వర్ణనా పద్యమిది :

'ఉదయగ్రావము పానవట్ట మభిషే
కోద ప్రవాహంబు వా
ర్ధి దరీధ్వాంతము ధూపధూమము జ్వల
ద్దీప ప్రభారాజి కౌ
ముదితారానివహంబు లర్చిత సుమం
బుల్ గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తిబింబ శివలిం
గం బొప్పెఁ బ్రాచీ దిశన్.'

ఉదయపర్వతము పానవట్టము. అభిషేకోదకము వార్ధి. కొండ గుహలయందలి చీకటి ధూపధూమము. వెలుగుచున్న దీపముల కాంతిపుంజము వెన్నెల. తారకలర్పితపుష్పములు కాగా చంద్రుడనే శివలింగము తూర్పుదిక్కున ఒప్పియుండెను. ఇది స్థూలముగా నిందలి భావము. ఎంతటి సౌందర్య భావన. ఈ భావనా ప్రవాహములో పడి ముందునకు కొట్టుకొని పోదుమేకాని మరల వెనుతిరిగి చూచు అవకాశమైనను మనకు కలుగని రీతిలో పద్యరచన కావించబడినది.

కాని సూక్ష్మముగా పరిశీలించిన పై రూపకాలంకార నిర్వహణలో రెండు చోట్ల క్రమభంగము కానవచ్చుచున్నది. ఇచ్చట ముఖ్యవర్ణనాంశము ప్రకృతి (చంద్రుడు). దానికి వాడిన ఉపమానములు శివసంబంధమైనవి.

ఉదయగ్రావము పానవట్టము అని చెప్పి తరువాత 'అభిషేకోద ప్రవాహంబు వార్ధి' అనుచున్నాడు. అసలు క్రమమయినచో వార్ధి అభిషేకోదకము కావలసియున్నది. అనగా ఉపమాన - ఉపమేయముల అస్తవ్యస్తత గోచరించుచు క్రమము తప్పినది. తరువాత చెప్పిన 'దరీధ్వాంతము ధూపధూమము' అనుచోట ఎట్టి విప్రతిపత్తియును లేదు. కాని మరల 'జ్వలద్దీప ప్రభారాజి కౌముది' అనుచోట

'కౌముది జ్వలద్దీప ప్రభారాజి' కావలసి యున్నది. అనగా ఉపమాన ఉపమేయముల తడబాటు జరిగి క్రమభంగము జరిగినది. ఆతరువాత చెప్పిన 'తారానివహంబు లర్పిత సుమంబుల్' అనుచోట క్రమము బాగుగనే యున్నది.

ఈ రెండుచోట్ల క్రమభంగము ఎందుకు కావలసి వచ్చినది? అందులకు గల కారణము లేమిటి ? అను విషయములు తెలిసికొనుటకు ముందు అసలు ఈవర్ణన ఏసందర్భములో చేయబడినది? ఆకథ ఏమిటి ? అనునది తెలియవలెను. కాదు ఆ కథలో మనము లీనముకావలయును. మహాకావ్యములలోని విశేషములను లోతునకు వెళ్ళి సముద్రరత్నములను వెలికితీసినట్లు లోనారసి పరిశీలింపవలయును గదా !

కథాసందర్భము :

ఒక నల్లత్రాచు దివ్యమాణిక్యములను తెచ్చి ప్రతిదినము ప్రాతర్వేళలో బాలేందు చూడామణిని ఆరాధించుచుండగా; ఒక హస్తిశ్రేష్ఠముకూడ ఆ శివుని అర్చింప మొదలిడెను. నల్లత్రాచు సమర్పించిన మాణిక్యములను అవలకు త్రోసివేసి తొండముతో పీల్చితెచ్చిన తోయములతో శివలింగమును స్నానము చేయించి, తాను తీసికొనివచ్చిన మారేడు శాఖలను, ఎఱ్ఱతామరలను, నల్లకలువలను ఏనుగు సమర్పించి అర్చించేది. మరునాడుదయము పాపతేడువచ్చి ఎవరో తన పూజను వ్యర్థము చేసి ముండ్లకంపను శివుని మీద పెట్టినందులకు విషాదము చెంది, ఆ ఏనుగు సమర్పించినవాటిని త్రోసి మణులతో యథావిధిగా గౌరీవల్లభుని అర్చించుచుండెను. ఇట్లు ఇరువురకు తమ పూజను ఎవరో వ్యర్థము చేయుచున్నారను వ్యథ నానాటికి ఎక్కువ కాజొచ్చెను. ఈవ్యథ కారణముగనే కాళము –

'భోగవతీ ఝురంబునఁ జొచ్చి బోటుల
తోడనాడెడు జలక్రీడ లుడిగి
పువ్వుబోణులుఁ దానుబొత్తులభుజియించు
మధుర సుధాహారవిధిఁ దొఱఁగి
బహువిధతాన సంపన్న గానంబుల
నిక్కి చొక్కడు తననేర్పు వదలి
ప్రాణనాయకితోడఁ బర్యంకసీమల
మసకానఁ బెనగు సంభ్రమము విడిచి
నిద్రవోయెడు సుఖమెల్ల నేలఁగలిపి
ప్రతిదినంబును దాఁ జయు రత్నపూజ
శివునిపై నుండకుండినఁ జింత నొంది
రాత్రి శివరాత్రిగా జాగరమ్ముఁ జేసె.'

ఇక ఏనుగుకూడ ఎప్పటియట్లు శివుని మీద రత్నము లుండుట జూచి నాతో ఎవరో పంతమునకు వచ్చుచున్నారు. నేటి కయిపోయినది. రేపుకూడ ఇట్లు నేను చేసినపూజ వ్యర్థమయి పాషాణము లున్నచో, వాడుగాని నేనుగాని మాలో ఎవరో ఒక్కరుమాత్రమే ఉండగలము. శివునికొరకు ప్రాణములైనను అర్పింతును. దీనికి సందేహము లేదు. ప్రాణముమీది తీపిగల ప్రాణులకు వ్రతములు కల్యాణకరములు కావు అనుచు –

'పిడియేనుగుల వెంటఁబడిపోక యుడుగని
వెడవిల్తువేడిమి విఱుపుఁ జంపఁ
గరమున నుదరోదకముఁ జల్లుకొనవన్నఁ
చెమలనిమిహిరదాహము దొలంగ
సరసునజొచ్చి తామరతూండ్లు మెసగక
మౌనని యాకటిమంట లేక
సింహపోతములు ఘోషింపఁబుట్టినభయా
తంకాగ్ని తహతహ గ్రుంకఁ బార
నెట్టి పెట్టలుఁ దనమీద నెక్కలేకఁ
బంచబంగాళమైపోవఁ బ్రాణలింగ
పూజ నావిఘ్నమునయందు పుట్టినట్టి
చింతయన్ వేకిఁ దనలోను చేసికొనియె'

ఇట్లు ఏనుగు నిజనివాసమునకు పోయి ఎప్పుడు సూర్యుడస్తమించునో, ఎప్పుడు మరల ఉదయించునో, నేను ఎప్పుడు పోదునో అని తలంచుచుండెను. ఈసందర్భమున కవి –

'ప్రాగ్వధూమణి చిమ్ముఁ బశ్చిమదిక్కాంత
పట్టిన చెంగల్వబంతి యనఁగఁ
గాలవిఘ్నుండంధకారదైత్యుని వ్రేయఁ
జరమాద్రిఁ బడిపోవుచక్ర మనఁగ
దినమహీరుహమునఁ దేజోమయంబుగాఁ
బండి రాలిన పెద్దపండనంగ
దివినుండి దేవదానవయుద్ధ రక్తార్ద్ర
మై నేలగూలు రథాంగ మనఁగ
బద్మినీ సంగమశ్రాంతిఁ బరిహరింప
నపరజలనిధి జలకంబు లాడబోవు
కరణి నెరసంజ చందురు కావిపచ్చ
డంబు ధరఁబెట్టి భానుబింబంబు గ్రుంకె.'

అను పద్యమున ఉత్ప్రేక్షాలంకారాంచితముగా సూర్యాస్తమయమును వర్ణించి, నాల్గు పద్యములతరువాత మొదట నుదహరించిన 'ఉదయగ్రావము పానవట్టము' అను పద్యమున చంద్రోదయమును వర్ణించెను.

ప్రస్తుత పరిస్థితిలో అటు కాళమునకు, ఇటు హస్తికికూడ 'చింత' యను జ్వరము తగులుకొని యున్నదని తెలిసికొంటిమి. ఈ చింతాజ్వరమునకు కారణము తమలో మాత్సర్యము చోటు చేసికొనుటయే. దానికి కారణము ఎవరో తమ పూజను వ్యర్థముచేయుచున్నారని తలచుటయే. ఇట్లు ఇరువురకు శివునిపై భక్తి ఎంత కలదో అంతకన్న ఎక్కువగా నిపుడు మాత్సర్యము అధికము కాజొచ్చెను. అనగా మనసులోని భక్తిభావమును మాత్సర్యము కప్పివైచెను. అది చివరకు ఒకరినొకరు చంపుకొనవలె నను వరకు దారితీసినది. అందుచేతనే అవి (కాళము-హస్తి) నిత్యకృత్యములతోపాటు నిద్రాహారములు కూడ మానినవి. ఇట్టి స్థితిలో నున్నవారికి సమస్తము అస్తవ్యస్తముగా గోచరించుటయే కాక, మనస్సునందలి భావములును సక్రమముగా నుండవు.

శ్రీనాథుడుకూడ ఒకచోట ఇట్టిసందర్భమున 'కంటికి నిద్రవచ్చునె సుఖంబగునే రతికేళి...కంటకమైన శాత్రవుఁ

డోకందు తనంతటివాడు కల్గినన్' అని చెప్పియున్నాడు.

ఇచట ధూర్జటి పాత్రల మనఃస్థితిని కొంత చెప్పి, మన స్తత్వమును వాచ్యముగాఁగాక తన రచనా శిల్పముద్వారా ప్రదర్శించ నెంచెను. కనుకనే పైరూప కాలంకార నిర్వహణలో క్రమభంగమును పాటించెను. అదియును అర్చనలోని ముఖ్యాంశములయిన 'అభిషేక-దీపము'ల విషయముననే. నిజమునకు కాళహస్తులకు జనించిన మాత్సర్యముగూడ అర్చన విషయముననే కదా!

ఈవిధముగా ధూర్జటి ఈ ఘట్టమునే కాక మొత్తము ప్రబంధమునే తన అసమాన ప్రతిభతో రచించెను. ఈ పద్యమాతని కావ్యార్ణవములోని ఒక బిందువు మాత్రమే ఇట్లు రచించెను కావుననే - 'స్తుతమతియైన యాంధ్రకవి

ధూర్జటి పల్కులకేల గల్గెనో
యతులిత మాధురీ మహిమ ?'

అని సాహిత్య సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలచే కీర్తింపబడెను.

—...—



# జాషువాకవి గద్యప్రబంధము - ఒక పరిశీలన

- శ్రీ డా. జి. బి. ఎస్. ఆచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.

పద్యరచనలో సిద్ధహస్తులైన జాషువాగారు ప్రథమ ప్రయత్నంగా 'కుశలవోపాఖ్యానము' అను గద్య ప్రబంధాన్ని రచించారు. ఇందులోని సమాసాలు, కథ, పినవీరభద్రకవి రచించిన 'జైమిని భారతము' లోని శ్రీరామచరిత్రనుంచి అధికంగాను, కంకంటి పాపరాజుకవి రచించిన 'ఉత్తర రామాయణము' నుంచి స్వల్పంగాను గ్రహించబడినాయి. అక్కడక్కడ వర్ణనాసౌష్ఠవాన్ని వెలయించి, సీతాదేవి రసాతలమునకు పోవువరకును కవిగారు రచించారు. ఇందలి భాష ధారాళమై శ్రుతిసుభగముగానున్నది. జాషువాగారు క్రైస్తవమతస్థులయ్యూను, ఇటువంటి హైందవ పురాణగాథాప్రపంచ మెరిగి, తత్సంప్రదాయాని కావంతయు వైరుధ్యాన్ని కలిగించక చక్కని భాషలో వ్రాయగలుగుట కవిగారి మత సామరస్యమును వెల్లడించుచున్నది. సందర్భోచితంగా సామెతలను, రసములను, భావములను, హిందూ మతాచారములను పొందుపరచి, వృత్త్యనుప్రాస భూయిష్ఠముగా, ఈ గద్యప్రబంధమును మృదు మధురశైలిలో కవిగారు రచించారు. ఈ గ్రంథానికి అభిప్రాయాన్ని వ్రాస్తూ కాశీ కృష్ణాచార్యులుగారు ఈ విధంగా పలికారు :

'తత్త్వ మెఱుంగలేక మతవైషమ్యము లఁబట్టుకొని యథోగతిపాలై యైకమత్య రహితమై యొప్పు హైందవజాతిని బునరుద్ధారము చేయుచున్న ప్రముఖులయొక్క శ్రమలు కొంతవఱకు ఫలించిన వని తాము వ్రాసిన ఈపుస్తక సందర్శనమున నాకుఁ దోచినది. ఇందలి కథాభాగము పాఠకులకు సంతోషజనకమై యలరఁగలదు. చూచినంతవఱకు శైలియు ధారాళమై యొప్పుచున్నది యని నా నమ్మకము.' ఈ ప్రశంసవలన జాషువాగారి మత సామరస్యము, రచనా నైపుణ్యము స్ఫుటతరము లవుతున్నాయి.

'శైశవక్రియల నొప్పు బాలు రేచింత లేకుండినను సంసార సాగరంబును దరింప లేక నిరంతరమును విచారించు గృహమేధిం బోలి శ్రీరామునకు మట్టుకు 'నాపుత్రస్య లోకోऽస్తి' యను స్మృతిని బట్టి మనోదుఃఖము లేకపోలేదు. లోకము నందు మానవునకు సుఖదుఃఖములు చిరకాలము నల్లే యుండవు. ప్రకృతి ననుసరించి చూచిన నీ విషయము బాగుగా తేటపడును. వృక్షములకు వసంతాగమమట్లు సుఖంబును, గ్రీష్మమట్లు దుఃఖంబును మానవుని వెన్నాడి తిరుగుచు దైవనిర్ణీతములై యుండును.' (కు. పా. పుట. 2) జాషువాగారి ఈ వాక్యాలెంతో సరళములై వినసొంపుగా నున్నాయి. లోకోక్తితోపాటు చక్కని ఉపమానాన్ని సైతం పొందుపరచి, చెప్పదలచిన విషయాన్ని చక్కగా, సుబోధకంగా చెప్పారు.

'రాజుల యైశ్వర్యభోగంబు లెంత యుత్కృష్టములో సంభవించు కష్టములు నంత దుర్భరములై యుండు' (కు. పా. పుట. 6) అని విధియొక్క నిర్దయతకు అబ్బురపడినారు. శ్రీరాముడు తండ్రి మరణాన్ని సైతం చూడటానికి నోచుకొనక పధ్నాలుగేళ్ళు అరణ్యవాసం చేయటం, సీతావియోగం, రావణుడి శక్తిచే లక్ష్మణుడు మూర్ఛపొందటం, మొదలైన దుర్భరకష్టాలు గడచి, రాజ్యాన్నేలుతుంటూ సుఖంగా వుండగా - అపవిత్ర అయిన సీతను దెచ్చుకొన్నాడను అప

ఆరుద్ర, కొప్పరపుసుబ్బారావు, కుందుర్తి, గజ్జెల మల్లారెడ్డి, కె. వి రమణారెడ్డి, మొదలగుకవులు తమ కవితా మహతులను శ్రుతిచేసి గానంచేశారు. ఈ కాలంలోనే మరొక యువకిశోరం తెలంగాణా ఫ్యూడల్ నిరంకుశత్వాన్ని ఎదిరిస్తూ 'ఖబడ్దార్! ఖబడ్దార్! నైజాం పాదుషాహీ!' అంటూ తన కవితా వజ్రాయుధాన్ని సృజించాడు. అతడే జగమెరిగిన సోమసుందర్ - ఆయన వజ్రాయుధం సంపుటిలోని ఫ్యాక్టరీ గేయంలో మార్క్సు కలలుగన్న సామ్యవాదవ్యవస్థకు మార్గం చక్కగా చిత్రితమైంది. దాని ఫలితమే ఈ వ్యాసం.

'అదిగో అది ఫ్యాక్టరీ
ధనమదాంధ అధికారుల
కనికార - రహిత గర్వం
ఆకృతియై
నిలిచిన ఫ్యాక్టరీ
అదిగో అది పొగగొట్టం
ధనస్వామి నిర్దయవలె నించొని
భుగ భుగమని
పొగ లెగజిమ్మే చిమ్నీ
లోకపు ఆవశ కాలపు
కారు రంగు
మసిపూసే చిమ్నీ.'

పెట్టుబడిదారీ సమాజంలోని ఉత్పత్తి సాధనాలలో ఫ్యాక్టరీఒకటి. ఇది పూర్తిగా పెట్టుబడిదారుల చేతుల్లో వుంది. శ్రామికుల స్వేదబిందువులు త్రాగి ఈఫ్యాక్టరీలు జీవిస్తున్నాయి. ధనదాహంతో మదమెక్కిన మహాప్రభువుల కనికార-రాహిత్య గర్వంలాగా ఫ్యాక్టరీ నిలబడి ఉందనటంలో ఫ్యాక్టరీని ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రతీక (Symbol) గా స్వీకరించటం జరిగింది. ఈ ఫ్యాక్టరీ పెట్టుబడి దారుడైతే ఇందులో ఒక్కొక్క భాగం పెట్టుబడి దారుని ఒక్కొక్కలక్షణంగా కవి మన కళ్ళముందు ఒక చలనచిత్రాన్ని ఫోకస్ చేస్తున్నాడు. 'పొగగొట్టం' నిటారుగా, నిర్భయంగా నిల్చొనివుంటుంది. ఇది ఏ మాత్రం వంగటంకాని, చలించటంగాని వుండదు ఈ పొగగొట్టం ధనస్వామి 'నిర్దయ'లాగా వుంది. ఎంతగా ఏడ్చినా, మొత్తుకున్నా, తమ కష్టాలను ఏకరువు పెట్టుకున్నా శ్రామికజన అవసరాలను ఆలకించని ధనస్వాములకు శ్రామికజనుల పట్ల దయ ఏనాడో యింకిపోయింది. ఏనాడైతే భుక్తికోసం శ్రమశక్తిని అమ్ముకోవాల్సివచ్చిందో ఆనాడే శ్రామికజనం సగం చచ్చింది ... శ్రామిక జన శక్తితో నిర్భయంగా, నిటారుగానిల్చున్న ఫ్యాక్టరీగొట్టం- శ్రామికజన ప్రయోజనాల నేసరికి 'కారు' రంగు పూయటం మనం చూస్తూనేవున్నాం. అవసరాలను ఆసరా చేసుకొని అడ్డంవచ్చినవాళ్ళను అధఃపాతాళానికి త్రొక్కుతూ తాము మాత్రం పొగలా పైకి, పైపైకి పోతుంటారు. అట్టడుగున పనిచేసే కార్మికుడు కనబడడు వీరికి. ఆకాశమార్గంలో రమ్యహర్మ్యాలు తప్ప అందుకే ఫ్యాక్టరీకూత నీతిమాలిందిగా వినిపించింది కవికి.

'అదిగో అది ఫ్యాక్టరీ
అహంకార ధిక్కృతిగా
భువి పేగులు దద్దరిల్ల
నీతిమాలి గర్జిస్తుం దదిగో.'

సూరీడొస్తే ఉదయం అవుతుంది లోకానికి, కానీ కార్మికలోకానికి మాత్రం ఫ్యాక్టరీ కూత వినబడ్డప్పుడే నిజమైన సూర్యోదయం అయినట్లు లెక్క. ఫ్యాక్టరీ సైరను ఎప్పుడు వినిపిస్తుందా అని ఆశగాచూస్తూ, సైరను వినబడగానే ఆదుర్దాగా, ఆశగా, పరుగెత్తుకొని వస్తారు శ్రామికులు. వస్తున్న శ్రామికులు మానవాకారాలలో వున్నంతమాత్రాన వాళ్ళు మానవులని పొరబడతారేమో -

'రెండు కాళ్ళపై కదిలే
యంత్రాంతర్భాగ దేహమ్ముల
ప్రతి స్వేదబిందువ్వూ
రక్తం వాహినిగా ధారవోసి
తేనెను సమీకరించేందుకు మాత్రం
పుట్టిన కూలీ లవి :
చూస్తున్నావా ?
బాధార్ణవ అగాధగర్భంలో పడి
దిక్కు తెన్నూ గానక
ఘూర్ణిల్లే నిర్భాగ్యులు
... ... ...
కూలీలట వాళ్ళే
మూర్తిగొనే ముఖాలతో
జీవకళా రహితమ్ముల
దేహమ్ముల :
వారా ? మానవులా ???
సత్స్వరూప వారసులా !
రక్తమాంసములు కలిగిన
యంత్రాంతర్భాగమ్ములు'

కష్టపడి తేనెను సమీకరించే దొకరు - అనుభవించేది మరొకరు. కష్టం ఒకరిది - ఫలితం వేరొకరిది. ఇది ఈనాటి మాట కాదు. 'ఏదేశ చరిత్ర చూచినా ... ఈ వ్యథార్థజీవుల యథార్థ గాథలు దిక్కులదిరేటట్లు ప్రతిధ్వనిస్తూనే వుంటాయి. కారణం? 'గతకాలంలో' ముక్కుమంచమునవాల్చిన, కళేబరాలను నడుపుకొనే, ఆలోచన చేయలేని, అలవాటుకు బానిసలైన శ్రామికజన దీనస్థితి వీళ్లు రోజూ నలిగే యంత్రాలలోని అంతర్భాగాల లాంటివాళ్ళు. వీళ్ళు లేకపోతే యంత్రాలు పనిచేయవు. యంత్రాలు పనిచేయకపోతే ఫ్యాక్టరీ పనిచేయదు. ఫ్యాక్టరీ పనిచేయకపోతే పొగగొట్టం భుగభుగమని పొగ విరజిమ్మదు. క్షణంలో ఫ్యాక్టరీ ప్రాణం గాలిలో కలిసి స్తబ్ధత మిగులుతుంది. అందుకే శ్రామికజనం తమరక్తం ధారవోసి ఈ ఫ్యాక్టరీని బతికిస్తున్నారు-కూటికోసం తమ శ్రమశక్తిని అమ్ముకొని అడుగడుగునా యజమానుల లోహపుగుండెల

# ఆధునికయుగమునందలి వివిధ సాహిత్య ప్రక్రియలు

– శ్రీ బి. మనోహర్ రావు, ఎం. ఏ.

ఆధునిక కవిత్వమునకు నవ్యకవిత్వము, అభినవ కవిత్వము, భావకవిత్వము (Lyrical Poetry) గేయము మున్నగు పదములు పర్యాయపదములుగా నున్నవి. ఆధునిక కవిత్వ మనగా ఆధునిక కాలమున అనగా 20 వ శతాబ్దిలో వచ్చిన కవిత్వమంతయూ ఆధునిక కవిత్వ మగును. ఈ నిర్వచనమునుబట్టి తిరుపతి వేంకటేశ్వరుల బుద్ధచరిత్రము, జనమంచివారి బ్రహ్మాండ పురాణము శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి యాజ్ఞవల్క్యచరిత్ర మున్నగు కావ్యములు ఆధునిక కవిత్వమే యగును. కావున ఈచిక్కు రాకుండ ఆధునిక కవిత్వ మనగా స్వభావమును బట్టియే ఆధునికకవిత్వముగాని కాలమును బట్టి కాదని గ్రహింపవలెను. ఇక భావకవిత్వము లిరికల్ పోయెట్రీ అను పదములు ఒకేయర్థములో వాడబడుచున్నవి. అట్లే అభినవకవిత్వము, నవ్యకవిత్వము అను పదములుకూడ ఒకే అర్థమున గలవు. వీని నన్నింటిని పరిశీలించి చూడగా సమస్త ఆధునిక గుణములుగల సకలవిధములయిన కవిత్వమునకు నవ్యకవిత్వ మను పదము వాడుట సముచిత మనిపించును. ఈ ఆధునిక కవిత్వమునకు కొన్ని విశిష్ట లక్షణములు గలవు. అవి :

1. ఖండకావ్య ప్రక్రియ 2 ఆత్మాశ్రయరీతి 3. వస్తునవ్యత 4. భావనవ్యత 5. శైలీనవ్యత 6. పదప్రయోగ నవ్యత 7. దేశికవిత 8. ప్రక్రియా బాహుళ్యము. ఈ లక్షణము లన్నింటిలో ప్రాచీనసంప్రదాయముల అర్వాచీన ప్రయోగముల యొక్క 'కొత్తపాతల మేలు కలయిక' కనిపించును.

వసుచరిత్రాది ప్రబంధముల అంధానుకరణముతో కీకారణ్యముగా మారిపోయిన తెలుగు సాహిత్యమును సుందరోద్యానవనముగా తీర్చిదిద్దినవారు భావకవులు. వీరు రచించిన కవిత్వమే భావకవిత్వ మనగా భావప్రధానమైన కవిత్వము. విశ్వనాథ సత్యనారాయణ గారు కవియొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము ఒక అంతర్నిగూఢతాపము ఒక చిన్న కావ్యములో ఊదబడినచో అది భావకవిత్వ మనిరి. ఇది ఆంగ్లములోని 'లిరిక్' నిర్వచనమునకు సరిపడుచున్నది.

కవి హృదయములో తటిత్తువలె అప్రయత్నముగా మెఱసిపోయిన భావముల అక్షరాకృతియే భావకవిత్వ మని శ్రీశ్రీ అభిప్రాయము. రసాంగములగు విభావానుభావాదులను సమగ్రముగా గ్రహించుటకు వీలులేదు గనుక ఏదో ఒక భావమును ఆధారము చేసికొని అల్పావకాశములో పూర్ణముగా రససిద్ధిని చేకూర్చుటకు చేయు ప్రయత్నమే భావకవిత్వ మని పంచాగ్నుల నారాయణశాస్త్రి గారి అభిప్రాయము. ఈ భావకవిత్వముయొక్క విశిష్ట లక్షణములనుబట్టి దీనిని ఆరు శాఖలుగా విభజింపవచ్చును. 1. ప్రణయ కవిత్వము 2. దేశభక్తి కవిత్వము 3. ప్రకృతి కవిత్వము 4. సంఘసంస్కరణ కవిత్వము 5. భక్తికవిత్వము 6. స్మృతికావ్యము.

ప్రణయ కవిత్వము :– ఈ ప్రణయ కవిత్వమున ఆత్మాశ్రయరీతి, వస్త్వాశ్రయరీతి, యని రెండు భేదములు గలవు. ఆత్మాశ్రయరీతిలో 1. స్వచ్ఛంద ప్రణయము 2. పూర్వరాగము 3. సంయోగదశ 4. ఆశాభంగము 5. విరహవిప్రలంభము 5. విషాదస్థితి 6. పలాయనతత్త్వము 9. విషాదమాధురి 8 ఊహాప్రేయసీసృష్టి 7. ప్రేయసీపూజ్యత 10. కులపాలికా ప్రణయము అను గుణభేదములు కలవు. భావకవులలో ప్రముఖులగు రాయప్రోలు సుబ్బారావు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, అబ్బూరి రామకృష్ణారావు, మున్నగువారి రచనలు ప్రణయ కవిత్వమున కుదాహరణములు. వీరందరు ఆంగ్లకవులైన వర్డ్స్‌వర్తు (Words Worth), షెల్లీ (Shelly), కీట్స్ (Keets) అనువారి కాల్పనిక కవితా రచనలచే ప్రభావితులై తెలుఁగులో ప్రణయకవిత్వము రచించిరి. ఉదాహరణమునకు – కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి; నాయని–సౌభద్రుని ప్రణయయాత్ర; విశ్వనాథ– గిరికుమారుని ప్రేమగీతాలు.

2. దేశభక్తి కవిత్వము : ఇందు భారత జాతీయోద్యమమునకు సంబంధించిన కవిత్వము కొంత తెలుఁగు రాష్ట్రోద్యమ కవిత్వము కొంత గలదు. వీనియందు తెలుఁగువారి శౌర్యప్రశస్తి ఐశ్వర్య ప్రశస్తి మున్నగు గుణములు కన్పించును.

ఉదా :– రాయప్రోలు – ఆంధ్రావళి, విశ్వనాథ – ఆంధ్రపౌరుషము, ఆంధ్రప్రశస్తి, తుమ్మల సీతారామమూర్తిచౌదరి– రాష్ట్రగానము, జాషువా – ముంతాజ్ మహల్, బసవరాజుఅప్పారావు–గీతాలు, దుర్భాక రాజశేఖర శతావధాని– రాణాప్రతాపసింహచరిత్ర, గడియారం వేంకటశేషశాస్త్రి – శివభారతము వస్త్వాశ్రయ రీతిలో నున్న దేశభక్తి రచనలు.

3. ప్రకృతి కవిత్వము :– ఇందు ప్రబంధములలోవలె గాక వాస్తవికమైన పల్లె ప్రకృతి పల్లీజనప్రకృతి (స్వభావము) కర్షకజీవనము మొదలగునవి వివరింపబడును.

ఉదా :– పింగళి కాటూరి – తొలకరి, కవికొండల వేంకటరావు–వివిధ కుసుమావళి, కృష్ణశాస్త్రి–కృష్ణపక్షము, అబ్బూరి–

ఊహాగానము, దువ్వూరి రామిరెడ్డి ప్రణయాహ్వానము, కృషీవలుడు, తుమ్మల సీతారామమూర్తి చౌదరి - పరిగెపంట.

4. సంఘసంస్కరణ కవిత్వము : ఇందు సంఘములోని దురాచారములను, వర్ణ వ్యవస్థను, సంఘవ్యవస్థను, నిరసించుట కనబడును. కొన్ని రచనలలో గాంధేయ దృక్పథము గోచరించును.

ఉదా :- మంగిపూడి వేంకటశర్మ బాలవితంతు విలాపము, అబలా విలాపము, భోగరాజు నారాయణమూర్తి - విధవా విలాపము, కాటూరి వేంకటేశ్వర రావు గుడిగంటలు, వేంకట పార్వతీశ్వర కవుల పంచమాభివందనము, పింగళి కాటూరి సౌందరనందము.

5. భక్తికవిత్వము :- ఇందు పారమార్థిక కవిత్వము మధుర భక్తికవిత్వము, తాత్త్విక కవిత్వము మున్నగు భేదములు గలవు. తెలుగున మధురభక్తికవిత్వ మంతగా ఇతరశాఖలు విస్తరిల్లలేదు.

ఉదా :- కృష్ణశాస్త్రి- ఋగ్వేథి, కృష్ణపక్షము, వేంకట పార్వతీశ్వర కవులు - ధ్యానసంకీర్తనము, ఏకాంత సేవ, విశ్వనాథ-శృంగారవీథి, దువ్వూరి- మృత్యువు.

6. స్మృతికావ్యములు :- దీనిని ఆంగ్లములో 'ఎలిజీ' (Elegy) అందురు. ఎలిజీ అనగా ఆప్తులైనవారు ఎవరైనను మరణించినప్పుడు వారి స్మృతిరూపకముగా వ్రాయబడిన కావ్యము. ఇందు 1. దేశనాయక స్మృతి 2. సతీస్మృతి 3. సుతాదిక స్మృతి మొ॥ భేదములు గలవు.

ఉదా : కృష్ణశాస్త్రి-మహాకవి, విశ్వనాథ-వరలక్ష్మీ త్రిశతి, బసవరాజు - గీతాలు, దువ్వూరి - సోదరీస్మృతి, ఇంచుమించు ముప్పదియేండ్లు తెలుగుసాహిత్య ప్రపంచమును బరిపాలించిన భావకవిత్వమును ఎదిరించి పుట్టినది అభ్యుదయ కవిత్వము. అభ్యుదయ కవిత్వ స్థాపకుడు శ్రీరంగం శ్రీనివాసరావుగారు. అభ్యుదయ కవిత్వముపై 'మార్క్సిజం' ప్రభావముకూడ విశేషముగా కలదు. అభ్యుదయ కవిత్వమును కృష్ణశాస్త్రిగారు ఈ విధముగా నిర్వచించిరి. పీడింపబడేవాళ్ళున్న ఈ వర్గసమాజము ఉండాలని ఎవ్వరూ కోరరు. రానున్న విధానములో సాధారణ మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటింపజూచే వారుఎప్పుడూ అభ్యుదయవాదులు కాజాలరు. ఈ ధనిక సమాజము పోవాలనుకోవడమే అభ్యుదయము. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన, శ్రీశ్రీ అభ్యుదయరచయిత. 'విప్లవదృష్టి' అను వ్యాసమున సాహిత్యము ఒక భోగవస్తువుగా పరిగణించే దృక్పథముమీద వీరు తిరుగబడుచున్నారు. నేటి రచయితలకు ప్రజలే ప్రమాణము. కొన్ని కారణములవలన సాహిత్యానికి దూరమైపోయిన ప్రజల జీవితాలను మరల సారస్వతోన్ముఖముగా త్రిప్పటానికి నేటి రచయితలు పాటుపడుచున్నారు అని అభ్యుదయకవుల కర్తవ్యమును వివరించెను. ఈ అభ్యుదయ కవిత్వమునందు గల విశిష్ట లక్షణములు 1. వర్గసంఘర్షణము 2. విప్లవ ప్రబోధము 3. వీర గాథా కథనము 4. యుద్ధవిముఖత, శాంతిప్రియత, 5. సమసమాజనిర్మాణము. దీని ఉదాహరణములు శ్రీశ్రీ - మహాప్రయాణము, ఖడ్గసృష్టి, మహాసంకల్పము, అనిశెట్టి సుబ్బారావు- అగ్నివీణ, దాశరథి-రుద్రవీణ, అగ్నిధార, సోమసుందర్-జ్రాయుధము, వకుందుర్తి ఆంజనేయులు - నయాగరా, సి. నారాయణరెడ్డి-జలపాతము. అభ్యుదయ కవిత్వముతోపాటు తెలుగుసాహిత్యములోనికి అతి నవ్యకవితాధోరణులు ప్రవేశించినవి. వానిలో -

1. అధివాస్తవికత (Sar realism) 2. సెక్సు (కామ Sex) 3. ప్రతీకవాదము (Symbolism) 4. నగర జీవన చిత్రణము 5. వైచిత్రీప్రియత్వము, వచన గేయము 6. అరాచకవాదము 7. నిరాశావాదధోరణి.

ఉదా :- పట్టాభి - ఫిడేలు రాగాల డజను, శ్రీశ్రీ - అభిసారిక, కడసారి, కొంటెకోణాలు ఆరుద్ర - విదూషకుని ఆత్మహత్య, త్వమేవాహము(నువ్వే నేను) సినీవాలి, కుందుర్తి-యుగే యుగే, తెలంగాణా, నారాయణబాబు - రెండోయి ఋషులు.

తెలుగు సాహిత్యమున పద్య వాఙ్మయము ఈవిధముగా భావకవిత్వమునందు ఛందస్సును విడువకున్నను అభ్యుదయ కవిత్వమునందు ఛందోరహితమైనది. కొందరి గేయములలో 'అంతర్లయ' కనిపించుచున్నను నేటి ఆధునిక కవుల రచనలు కేవలము వచనగేయములుగానే వెలువడుచున్నవి.

ఆంగ్ల సాహిత్య ప్రభావముచేత పద వాఙ్మయమేగాక గద్య వాఙ్మయమునందు గూడ మార్పులువచ్చి నూతనప్రక్రియలు పుట్టినవి.

వానిలో నవల, కథ, కథానిక, సాహిత్యవిమర్శ, వ్యాసము, జీవితచరిత్ర, స్వీయచరిత్ర మున్నగునవి ముఖ్యమైనవి. వీనిలో పెక్కింటికి కందుకూరి వీరేశలింగము ప్రారంభకుడు. అట్లే నాటక వాఙ్మయమున అనేక పరిణామములు కలిగి సాంఘిక నాటకములు, ఏకాంకికలు, నాటికలు, విశేషముగా రచింపబడుచున్నవి. గేయ వాఙ్మయమునందు గూడ విశిష్టమైన మార్పులు వచ్చినవి. నండూరి సుబ్బారావుగారి 'ఎంకిపాటలు', కొనకళ్ళ వేంకటరత్నంగారి 'బంగారిమామ' పాటలు, విశ్వనాథ 'కిన్నెరసాని' పాటలు, 'కోకిలమ్మ పెండ్లి' మున్నగునవి వీని ఉదాహరణములు.

ఈ విధముగా ఆధునిక యుగమున పద్య, గద్య, గేయ, నాటక వాఙ్మయములందు అనేక పరిణామములువచ్చి నూతన ప్రక్రియ లనేకములు పుట్టినను సంప్రదాయము పూర్తిగా విడువబడలేదు విశ్వనాథవారి 'శ్రీమద్రామాయణ కల్పవృక్షము' ప్రాచీన రచనాసంప్రదాయమునకు చక్కని యుదాహరణము.

— ... —

( 7 వ పేజీ తరువాయి )
చైతన్యంతో పురోగమిస్తున్నది. అగణిత అసంఖ్యాక శతసహస్ర నిర్భాగ్యులు నవోత్తేజవాహినిగా వస్తున్నారు. ఇక పెట్టుబడిదారీవ్యవస్థ సమూలంగా నాశనమౌతుంది. అస్తవ్యస్త సమాజంలోని నిమ్నోన్నతాలు సమసిపోయి విశాల వితర్ది యేర్పడుతుంది. ఇక ఎవరడ్డం వచ్చినా –

'కార్మిక కోపాగ్నిచ్ఛటలకు
తాళలేని శలభంవలె
ధనస్వామి తపతపమని
పాదాంతం వణకిపోయి
విప్లవ శక్తికి
పాదాక్రాంతుడయే
శుభసమయ మ్మదే
ఆసన్నం అవుతున్నది
ఆరంభించిం దపుడే.'

అనాథుడికీ, అగర్భశ్రీమంతుడికీ మధ్య అనాదిగా సాగుతున్న ఈ అనంతసంగ్రామంలో శ్రామికశక్తి విజయం పొందుతుంది. పెట్టుబడిదారులుకట్టుకున్న పసిడి మేడలు ప్రక్కకు ఒరిగిపోతాయి. మార్క్సు కలలుగన్న సోషలిస్టు వ్యవస్థ యేర్పడుతుంది.

'వృద్ధజగతి సమాధిపై సమధర్మం
ప్రభవించును
నిద్దుర చీకటి వెలుపల వేకువ
పుట్టును.'

— ... —

# శ్రీమాన్ అద్దంకి-కవిభూషణ కుమార తాతాచార్యులవారు

– శ్రీ భాషాప్రవీణ కె. రామానుజాచార్యులు.

లక్ష్మీనృసింహసుత తాతకులావతంస
శ్రీమత్కుమారకవి భూషణతాతసూరేః।
గ్రంథేషు 'తత్త్వపదవీ' 'వివృతిశ్చతస్యాః
శ్రీనాథపాదయుగళే భవతాం శుభాయ॥
తత్త్వపదవీతః.

అను శ్లోక మందలి 'కవిభూషణ' బిరుద భూషితులగు శ్రీమత్కుమార (కవిభూషణ) తాతాచార్యులవారు–గతవిభవ సంవత్సర చైత్రశుక్ల నవమీ పునర్వసువున శ్రీరామచంద్ర పరబ్రహ్మము జన్మించినట్లుగ– అద్దంకి సింగరాచార్యులు పెరుందేవమ్మ గార్లకు – ఒంగోలు తాలూకా– తక్కెళ్ళపాడు అగ్రహారమున జన్మించి 'సుపుత్రేణ కులం యథా' యన్న వాక్యమును సార్థకపరచిరి. వీరు షట్చక్రవర్తుల వలె – అర్థరన్నదములు. వీరు ద్వితీయులయ్యు ప్రజ్ఞాప్రాభవములందు – అద్వితీయులు. సంస్కృతాంధ్రద్రవిడ భాషలను మథించిన మంథానగమువంటివారని వారి కృతులేసాక్ష్య మిచ్చుచున్నవి. 'ఏక స్స్వాదు న భుంజీథాః' అన్నట్లు తమ మిత్రులకు – పండితులకు – పైకావ్యామృతమును పంచియిచ్చిన మాన్యవతంసులు – సుమముతోడి సూత్రమునకును సౌరభ మబ్బినట్లు తమయాస్థానముననున్న పండితకవులకును తమవలెనే కీర్తిప్రతిష్ఠలు కలిగించిన సరసహృదయులు.

సుమారు నలువది వసంతముల కాలము శారీరావరివస్య నెరపుచు సారస్వతామృతమును గ్రోలుచు శిష్యవిత్తాపహారులు కాకుండ శిష్యహృత్తాపహారులై కేరళవర్మయను మళయాళదేవరాజకవి సింహునిచే ఆనాడు అనుపమానమైన 'కవిభూషణ' యన్న బిరుదమును పొందిన, మహాకవి సార్వభౌములు.

భవభూతి కవిరచనలలో 'ఉత్తరే రామచరితే' అన్న పేరు పెంపునకు భాజనమైన 'ఉత్తరరామచరిత్రకు' 'కళా' యను పేరచక్కని వ్యాఖ్య వ్రాసిరి. కేరళవర్మ రచించిన 'భారతీ కాళిదాసః' అన్న గ్రంథమును విమర్శించుచు భవభూతి భారతి' యన్న పేర ఆ మహాకవి కవితావైశిష్ట్యమును తెలుపుచు వ్రాసి కవిభూషణ బిరుదభూషితులైరి.

ఇవిగాక తమ యంతేవాసుల కుపయోగ పడునట్లుగ 'సదాచారసారము' 'పరమార్థ ప్రకాశము' 'సద్ధర్మమంజరి' వంటి సంప్రదాయ రహస్యగ్రంథములను వెలయించిరి. 'తత్త్వపదవి' వంటి విమర్శ గ్రంథములను, శ్రియః పతిప' వంటి అనువాదములను వెలుగునకు తెచ్చిరి. పురాణవాఙ్మయమును పరిశీలించు భరద్వాజసంహిత'కు చక్కని ఆంధ్రవ్యాఖ్య వ్రాసిరి.

ఆగమపరిశోధన పరమేశ్వరులై శ్రీరామబాణః, విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, ఋతుమతీ వివాహఖండనము, విమర్శనామ కశ్చి న్నిబంధః, వంటివి వెలువరించిరి. ఇవన్నియు శ్రీవైష్ణవపత్రికయందు వెలువడినవి.

కవులై కావ్యములు రచించుటేగాక విమర్శవిద్యాస్వతంత్రులై విమర్శ చేయుటేగాక పరిశోధనపరమేష్ఠులై కవిరాజకృత రాఘవపాండవీయము వంటివేగాక ఎన్నో సంహితలను పరిశోధించిరి. (అడయార్ తేరాఫికల్ సొసైటివారు కొన్ని వెలువరించిరి) స్తోత్రార్ణవమును పరిశీలించిరి. ఇవన్నియు సంస్కృతరచనలు.

ప్రాకృత వాఙ్మయమును కూలంకషముగ చవి చూచియు పెద్దకావ్యాలు

వ్రాయకున్నను తమ ఇలువేల్పగు లక్ష్మీ నృసింహమూర్తి గుణౌఘములను ఒక్క శతకమున స్తుతించిరి. ఇది యముద్రితము. 'అథవా నైతదాశ్చర్యం హృదయ స్నేహ యానసే' అన్నట్లు హయగ్రీవమూర్తిని ప్రాకృతముననే భజించిరి

'నాటకాంతం హి సాహిత్యం' అన్నట్లుగా 'సౌమిత్రి విజయవ్యాయోగము' ను వ్రాసిరి. ఇదియు నముద్రితమే. సంస్కృత సారస్వతమున భల్లటము వంటి అన్యాప దేశకావ్యాలు చాలకలవు. వాటిమార్గము ననుసరించి 'సుభాషిత తరంగిణి' అను పేరుతో నూరుశ్లోకాలు వ్రాశారు. 'యమ ప్రణామశతకము' వెలుగుకు తెచ్చిరి. ఇవన్నియును గాక వారిగ్రంథాలయమున ఇంకను కొన్ని యముద్రితాలు అసమాప కములునుండి యుండవచ్చును. అదియొక మహాసంద్రము వంటిది.

శ్రీరామబాణము వంటి గ్రంథములు మహావిద్వాంసులు, రాష్ట్రపతి బహుమతి గ్రహీతలు, ఆ కల మన్నాడు పార్థసారథి భట్టాచార్యులవారి విమర్శలకు నాలయమైనది.

త్యాగభోగములకు నిలయమైన - వంశమున పుట్టు వొందిన వారవుట - జమీందారులుగా ప్రభుత్వము వారిచే గుర్తించబడిన సంస్థానాధీశులవుట - తమ కొలువున తమతో సమానులైన అ. ము. నరసింహాచార్యస్వామి అ.ము. శ్రీనివాసాచార్యస్వామి, పండిత చక్రవర్తి తిరువేంకటాచార్యస్వామి వంటివారిని ఆదరించిరి, పోషించిరి, గౌరవించిరి. వీరే కాక ఇంకను పలువు రున్నారు.

వీరియాస్థానము నిరంతరము సారస్వత వ్యాసంగములతో వాక్యార్థములతో సద్గ్రంథ కాలక్షేపములతో రాయల భువనవిజయమును స్మరింపఁజేసెడి దని బరిచితుల పసిడి పలుకులు.

ఆయా పర్వములలో పండువులలో విందులతో వినోద ప్రసంగములతో కైటభదైత్య మర్దనుని గాదిలి కోడలు శ్రీవారిరసనాగ్రమున హావభావవిలాసములతో నృత్యము చేయుచుండెడి దని వారి గ్రంథములు చాటువులు సందర్భములే సాక్ష్యము పలుకుచున్నవి.

వీరు నాకు మాతామహు లవుటనే కాక వీరికావ్యములపై ఉన్న మిక్కుటమైన గౌరవాభిమానము లీ నాల్గు మాటల కవకాశ మిచ్చినవి. వారి జీవిత చరిత్రయంతయు సమీక్షింపవలయునన్న మరియొక 'కవిభూషణుడే కావలయును. చంద్రునకు నూలుపోగన్న చందమున కొంత సారస్వత లోకమునకు తెలియ చేయుచున్నాను. వీరినిగూర్చికాని వీరి గ్రంథాలను కూర్చికాని కవిచరితకారుడు కాని (అ) సమగ్రాంధ్రసాహిత్యకారుని వరకు ఏ ఒకరుకాని ఒక వాక్యముకూడా వ్రాయలేదు.

కవిభూషణ కావ్య సమీక్ష మరియొక పర్యాయ మొనర్తును. ప్రకృతము లభించిన చాటువులను పరిచయ మొనర్చుచున్నాడను.

శ్రీవారి మాళిగలో మిద్దెమీదనున్న ఓ స్త్రీచిత్రమును ఆశువుగ వర్ణించుమనగా నిట్లు వర్ణించిరట.

*చుబుకాన్వితైక హస్తా
సాచీకృతకంధరాస్మితేందుముఖీ!
దయిత మవలోకమానా
వ్యనక్తి భావం నిజం బాలా'

ఒక స్త్రీ కుడిచేతితో పైగడపను పట్టుకొని వీథివైపుచూచుచుండగా అట్లే వర్ణింపు మనిరట మిత్రులు.

*నాసాలంబి కరాంచిత శిలా
ప్రాప ప్రవాళ శ్రియా.
నీతేందీవరదామ తోరణవతీం
వీథీం దృశా తన్వతీ
ఉన్నాభి స్తన కుంభసంభృత రస
స్వశ్రేయసా ప్రాచురీ
కాచిక్కాంతిభరాపహ స్తిత నిశా
చైతన్య మాచామతీ'

ఇందలిభావ మాధుర్యమును పాఠకులే ఊహింతురుగాక! ఇది ఆశుకవితయా? ఆలోచనకవితయా? పరిశీలింపుడు.

ఇలువేల్పు లక్ష్మీ నృసింహమూర్తి. ఆయన కలలో కనఁబడగా ఆ స్వప్నమ దే ఇట్లు స్తుతించినారట.

*సర్వరోగ ప్రశమనం
మాధురం ఘట కాచలే!
సిద్ధమౌషధ మాశాసే
శరీరే ఘటకా చలే.

ఒకనాడు తిరువల్లిక్కేణి పార్థసారథి సన్నిధిలో ఒకపండిత గోష్ఠిలో అన్వయించుట తటస్థింపగా ఎవరోఒక మహామనీషి ఈ సమస్యను చమత్కారముగ ఆశువుగాపూర్తిచేయ కలరా? అని కదళీలావ మిదంవిలూయతే'అనె నట. వెంటనే వీరందుకొని,' అఖిలాగను మాళికుండనంయసు నాథోయది నః ప్రసీదతి, మనుతే న హిజన్మమాదృశాం, కదళీలావ మిదం విలూయతే' అనగానే సర్వు లాశ్చర్య పడిరట. అది హయగ్రీవుని కరుణాకటాక్షము. వైష్ణవులు జాబు వ్రాయునప్పుడు 'శ్రీమతే రామానుజాయనమః' అని వ్రాయు టాచారము. అట్టి ఒక లేఖలో ఇట్లనిరట.

*మూకముక్తి ప్రదం కించి
త్కారుణాకందళం మహః।
భాగధేయం భవార్తానాం
భావయే యం హృదంబుజే॥

ఇందెంత,మధురభావ మిమిడి యున్నదో ఊహింతురుగాక!

తమ మిత్ర పండితుడు అనారోగ్యం నుండి ఆరోగ్యవంతు డగుచున్నా డని విని సంతసముతో నిట్లనిరట.

ఉల్లాఘతాంతు భవతామధునా నిశమ్య
కించిత్సముశ్వసతి మామక మంతరంగః।
అబ్దినికాముపయా త్యరుణోదయేపి (?)
భానోఃభవిష్యదుదయం మనసా కలయ్య॥

భీష్మాచార్యులవారు మరణశయ్యపై నుండి ఎట్టి భగవద్రూపమును చూడగోరుచుందురో ఊహింపుడన.

కృష్ణామానసమర్ణవప్రణవతా
  నిత్యాన్యకేవింరకః (?)
శ్రీమాన్ పాండవసారథిః మునిసభా
  సంద్రుష్ట రూపాద్భుతః।
ద్యావాలంబన మంతి మేపిసమయే
  భీష్మస్య కశ్చిద్యావా
నిత్యందివ్యతు మానసే సతు మమ
  క్షేమాయ భోభూయతే॥

ఇందు తనకును అట్టి పరమాత్మ సందర్శనము కలుగవలయుననియు ధ్వని.

మరొక పర్యాయము
పార్థవ్యాయామసాక్షీ కురునృపతివధూ
  పత్రభంగాపహారీ
గీతాశాస్త్రోపదేష్టాసురవిటపిసము
  న్మూలనే దంతి మల్లః।
గాంగేయానంద హేతోః ప్రహరణకలితా
  భావసంధానకీర్ణే
నిర్వ్యాజత్రాణదీక్షా మమనిబిడతమ
  స్తోమతృణ్యాత్ వితృణ్యాం.
అని వర్ణించిరట.

ఊర్ధ్వ పుండ్రధారణ మొనర్చుచున్న మిత్రుని ధారణాపటిమను పరీక్షింప తలచి ఈశ్లోకమును చెప్పిరట. తరువాత కొన్ని రోజుల పిదప ఏదిశ్లోక మని యడిగిరట.

రహస్యం సదస్యం చ సర్వార్థయుక్తం
వచో యస్య బుద్ధిఃకుశాగ్రాన్నిశాతా
సవిద్వల్లలాటం తపోరంగసూరిః
మమాంతస్థోమ తృణ్యాంవితృణ్యాం'

ఆదేరీతిలో చదువ ఆశ్చర్యపడిరట ఆనాటి విద్వద్వతంసుల ధారణా పటిమ పాండిత్యము ఎట్టివో యూహింతురు గాక!

కేరళవర్మ యను మళయాళదేశపురాజు మహామనీషియే కాక విమర్శక కళావిద్యా ప్రవీణుడు. చక్కని చిక్కని కవిత లల్లగలవాడు. 'భారతీ కాళిదాస ?' యను పుస్తకమును వ్రాసి ముద్రించగా దానిని గాంచిన కవిభూషణులు భవభూతియే భారతి యని సహేతుకముగా విమర్శించుచు ఒక గ్రంథము వ్రాసి వానికిపంపగ నత డాశ్చర్య చకితుడై హర్ష పులకిత గాత్రుడై తోడి పండిత బృందమున ఆవ్యాసమును చదివి వినిపించి వీరికి కవిభూషణ; అన్న బిరుదమును రిజష్టరు చేసి పంపెను. కాలాంతరమున పరిచయ మధికమగుటతో మాహాస్థానమునకు మిమ్మాహ్వానించి సమ్మానింప నిశ్చయించితి మని వ్రాయగా వీరును వారికి సహఉజ్జీయే కావున ప్రత్యుత్తరమున నిట్లు వ్రాసిరట.

శ్రియః సంతు క్షోణీపతిషు, మదవత్కుంజరఘటా, చలత్కర్ణోద్గీర్ణైరలిభి
రభిశప్తా ప్రతిదిశం, వయం తావల్లక్ష్మీరమణ చరణద్వంద్వ శరణాః, తృణాయాపిత్యుల్లా పదమివ న మన్యామహ ఇమే'
మందాం దోళిత గంధవాహతరలో
  దంచద్దుకూలాంచలా
స్పృష్టాలక్ష్య తపీవర స్తనభరో
  న్నిలన్న ఖాంకావలీ
లజ్జాసమ్భ్రమ సాధ్వసాతి చపలే
  వ్యాపాదయంతీ దృశౌ,
స్థాతుం వా సహసా ప్రయాతు మపివా
  శక్నోతి నైవాబలా'
అని రట 'విద్వా నేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అన్నవాక్యమీ ఇరువురి యందు సార్థక మైనది.
మరొక పర్యాయము
జలధర వర్ణాయనమః
  జనిమృతి హరణాయినను?
జలజదళనయనాయ నమః
  జగదేక ధనుర్ధరాయ నమః'
ప్రసంగవశాన వివరోమీ రిట్లా శ్లోకాలు చెప్పుతుంటారు. అది ఎట్లు సాధ్య మనగా అథవా నైత దాశ్చర్యం హృదయ స్థే హయాననే'అని సమాధాన మిచ్చిరట.

వీరు రచించిన గ్రంథము లన్నియు పునర్ముద్రణ చేయుట సాహిత్యలోకమున కెంతో యుపకారము చేసిన ట్లగును. ఆంధ్ర సాహిత్య అకాడమీవంటి సంస్థ ఉత్తర రామ చరిత్ర వ్యాఖ్యనైనను వెలువరించి పుణ్యము కట్టుకొనదగు నని ప్రార్థించుచున్నాను.

వీరి వంశమున జనించిన వారిలో చాల మంది ప్రసిద్ధులు కలరు. వీరి సోదరులు తిరుమలాచార్యులవారు తిరుమంత్రార్థము నాంధ్రీకరించిరి. వీరికుమారులలో నొకరు తాతాచార్యులు వారు సరసమధురముగ శ్లోకము లల్లగల ప్రజ్ఞాధురీణులు. మరి యొకరు హాలుని గాథాసప్తశతిని ఆంధ్రీకరించినారు. తిరువేంకట దేశికాచార్యుల వారు సంస్కృత ప్రాకృతాంధ్రములలో ననేకస్తోత్రములు రచించిన మహాకవులు. వీరి కుమారులు విద్యాభూషణ సింగరాచార్యులవారు. మేఘనాథ విజయ వ్యాయోగము, మాళవికాగ్ని మిత్ర విమర్శము, యతి రాజోదంతము, పంచలహరులు రచించుటేకాక బాల రామాయణ నాటకముపై చక్కని విమర్శ వెలయించిరి. వీరు విశ్వనాథ సత్యనారాయణ గారు వ్రాసిన భ్రమర గీతలకు బహువిస్తృతమైన భూమిక వ్రాసిరి. వీరి జీవిత చరిత్రను ఈ రచయితయే విపులముగ వ్రాసినారు.

ఇప్పుడు నవయువకులలో సమర్థులైన సాహిత్య సంపన్నులు చక్కని కవిత చెప్పగలవారు ననేకులున్నారు. పరనాత్ స్మరణా ద్వాపి చరిత్రాణాం మహాత్మనాం, గుణపాకో మహాన్ హి స్యా దాత్మనిశ్రేయసే హితః' అన్న భావముతో నీ నాల్గు మాటలు వ్రాసితిని.

[ఈ వ్యాసములోని కొన్ని శ్లోకములు అనన్వితములుగను, అక్షరలోపసహితము గను ఉన్నవి. అవి లేఖకదోషములా ? సంపా.]

— . . . —

# సాహిత్యంలో అహల్య

- శ్రీమతి పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం.ఏ., పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

'బ్రహ్మపురాణమున' అహల్య ఇంద్రుని దేవరాజని గ్రహించియే అతని కోరిక నంగీకరింప సిద్ధపడినట్లుగ గలదు. ఈ పురాణము నందలి శాపము మరియొక విధముగ నున్నది. తాపస్యాహ మలినః క్రోధాత్ త్వం చ శుష్కా నదీ భవ. యదాతు సంగమే గౌతమీం పాపనాశినీం నదీభూత్వా, పునారూపం ప్రాప్య సేపాపకృత్ మమ' అని ఆమెను ఒక ఎండిపోయిన నది యగునట్లును, ఆ నది గౌతమీనదితో కలిసినపుడు శాపమోక్షము నగు ననియు ఈ పురాణము పేర్కొనినది.

గౌతముడు అహల్యను రాయివై యుండుమని శపింపగా ఆమె కుమారుడు శతానందుడు, శాపవిమోచనమునకై తండ్రిని ప్రార్థించినాడనియు, ఆమె నర్మదాతీరమున స్నానమాడి, చాంద్రాయణ వ్రత మొనర్చి, ఈశ్వరలింగమును ప్రతిష్ఠించి పరమభక్తురాలుగా మారిన దనియు 'స్కాందపురాణము' వర్ణించినది

ఇంకను 'దేవీభాగవతము, బ్రహ్మవైవర్త, విష్ణుపురాణాదు' లందు అహల్య కథకలదు. ఇంచుమించుగ అవి పైమార్గమున కనుసరణములే.

ఇక తెలుగు సాహిత్యము నందలి అహల్య పాత్రచిత్రణ చాలవఱకు సంస్కృత సాహిత్యపు అడుగుజాడలలోనే నడచినది. కాని కాలక్రమమున ఆమె లౌకిక మగు సామాన్య స్త్రీగా మారినది. కొన్ని కావ్యములు ఆమె కాముకత్వపు పరాకాష్ఠను ప్రదర్శించినవి.

అహల్యనుగూర్చి పేర్కొనిన మొదటి తెలుగుకావ్యము 'రంగనాథ రామాయణము.' ఇందు ఇంద్రుడు గౌతముని తపోనిష్ఠను చెఱుపుటకై గౌతమ రూపమున అహల్యను చేరినాడు. ఆమెయు 'నీ వింద్రుండ వగుట యెఱుగుదు నాగాక, ఇందు రమ్మనుచు' అతనిని ఆహ్వానించినది. గౌతముని కూడి పెక్కు సంవత్సరములు దాంపత్య జీవితమును గడిపిన అహల్యకు, నియమ నిగ్రహములకు స్థానము కావలసిన మునిపత్ని యగు ఈమెకు ఇది అనుచిత ప్రవర్తనము. అందుచే గౌతముడు

'పడతి పాషాణమై పడియుండు మీవు
కర ముగ్రమగు నెండగాలి పెంధూళి
బొరలుచు నెందును బోడగానంబడక'

అని శపించినాడు. ఈ శాపవిధానము ఆనంద రామాయణము ననుసరించినది. వాల్మీకి విధించినశిక్ష ఆమెయందు పశ్చాత్తాపమును కలిగించునట్టిది, కాని కేవలము పాషాణరూపమును పొందుటచే పశ్చాత్తాపమునకు ఇందు అవకాశములేదు. చివఱకీమె శ్రీరామపాద రాజీవపరాగముచే 'అహల్య హతమనశ్శల్యయై' నిజాకృతి దాల్చినది.

'రంగనాథ రామాయణము ఉత్తర కాండయందు' అహల్య వృత్తాంతము కలదు. ఇందలి కథ మరియొక తీరున ఉన్నది. అహల్య ఒకమారు పరిస్థితుల ప్రాబల్యముచే ఇంద్రునకు లోబడినది. బ్రహ్మ, అహల్యను కరుణించి మన్నింపుమని అల్లుడైన గౌతముని ప్రార్థించినాడు. ఆ తరువాత ఆమె సూర్యునివలన మరొక కుమారుని పొందినది. రెండవమారు మరల దేవేంద్రుడు వచ్చినాడు. ఇక నిగ్రహము నవలంబించలేక గౌతముడు పత్నిపై ఆగ్రహము పొంది _

'ఈ తపోవనమున నింతి నాయొద్ద
నీతిమాలిన నీవు నిలువంగ దగదు
చతుర యౌవనరూప సౌందర్యమదము
కతమున నీవిట్లు గానక నేడు
ధృతిచెడ పరుగూడి తిట మహాపాప
మతిపూని నన్నవమానంబు జేసి
కడు దప్పు సేసితి గాన నొప్పెల్ల
నెడలు లోకముజేర కీవనాంతమున
వేపోయి పాషాణరూపంబు నంద
యాపద పడుచుండు ... '

రంగ.రా. ఉ.కాం. పు. 33.

అని శాప మిచ్చినాడు. ఇట్లు ఈ కావ్యమున అహల్య ప్రవర్తనకు కారణము 'చతుర యౌవనరూపసౌందర్యమద' మని పేర్కొనబడినది. ఇంక శాపవిధానము ఆనందరామాయణము ననుసరించినదియే. శాపాంతము సర్వకావ్య సామాన్యమే.

'భాస్కర రామాయణము' అహల్య వృత్తాంతమును మరింత విపులముగ చిత్రించినది. గౌతమునితో గడిపిన జీవితమునందలి అసంతృప్తి, ఆమె అనవరతము పొందుచున్న మన్మథబాధలు, గౌతమ రూపమున వచ్చినవాడు ఇంద్రుడని గ్రహించి ఆమె పొందిన వివశత్వము, ఇందు విపులముగ వర్ణింపబడినవి. రంగనాథ రామాయణము ననుసరించియే ఇందలి శాపవిధాన మున్నది. చివఱను విపుల శాపభారంబున తప్తమానసయగు ఆమె రామదర్శనముచే నిజాకృతి దాల్చి, వానిని అతిథి సత్కారములచే పూజించి, తపోబల శుద్ధాత్మయై పతిని చేరినది.

'మొల్లరామాయణము'న ఈమె వృత్తాంతము అతి సంక్షిప్తము. శిలయై ముడిబంగారమువోలె పడియుండిన అహల్య రామపాదనికషోపల స్పర్శమున 'కరగిన బంగారుపూదె' వోలె లావణ్యస్థితి పొందినది. పదధూళి సోకి భామినిగా మారిన యీ రాయి 'మున్ను కులపావన చూడగ చిత్రమయ్యె' అని ఈమె పేరుకూడ చెప్పకుండ కవయిత్రి ఈమె కథను ముగించినది.

'రామాభ్యుదయము, అచ్చతెలుగు రామాయణము, ఉత్తరరామాయణవ

పై కావ్యముల అడుగుజాడలలోనే నడచి, అతిసంక్షిప్తముగ ఆమె కథను ముగించినవి.

అహల్యా చరితమును మలుపు త్రిప్పిన మరియొక కావ్యము పుష్పగిరి తిమ్మన 'సమీరకుమార విజయము' బహుశః దీనికి రంగనాథ రామాయణమునందలి ఉత్తర కాండ ఆధారము గావచ్చును.

బ్రహ్మ అహల్యను సృజించి గౌతమునకు భార్యగా ఇచ్చినాడు. ఇంద్రుడామెనుపొంది శాపమునకు గురియైనాడు. ఇంతవరకు కథ పూర్వకావ్యాను సరణమే. అహల్య తండ్రియగు బ్రహ్మ గౌతమునిచేరి, కుమార్తెను మన్నించుమనియు, ఇదికాక ఒకటిరెండు తప్పులు కాయుమనియు అల్లుని సమాధానపరచి వెళ్ళినాడు. కాని అప్పటినుండియు అహల్య గౌతముని అనుమానమునకు గురియైనది. ఇది ఇందలి నూతన విషయము. గౌతముని యందు అహల్యకు అంజనఅను ఒక పుత్రిక కలిగినది. ఇంద్రునివలన ఒక కుమారుడు కలిగినాడు. పతిసేవతో, పిల్లల పెంపకముతో ఆమె అత్యంతపవిత్ర జీవనము గడపసాగినది. కాని అతిలోక సౌందర్యశాలి యగుఆమెకు భద్రతయే కఱవైనది. ఒకనాడు ఆమె కొలని ఒడ్డున విరులు కోయువేళ, ఆమె సౌందర్యము సూర్యునిమది నాకర్షించినది. అతడు కామార్తుడై నిజాకృతి ధరించి వచ్చినాడు. మహర్షి పత్ని అగుటచే ఆమె భయ భక్తులతో అతిథి పూజలు చేసి, అతనిరాకకుగల కారణమును ప్రశ్నించినది. కామార్తుడై అతడు 'కొంగొడియట్టగా' ఆమె విభ్రాంతయైనది. చివరకు జరుగవలసిన దంతయు జరిగినది. కాని ఆమె తండ్రి గౌతముని దగ్గఱ తీసికొనిన వాగ్దానము వలన ఈ పర్యాయమును గౌతముని ఆగ్రహమునకు గురిగాక తప్పించుకొనినది. చివరకు సుగ్రీవునకు తల్లియైనది. పిమ్మట మరికొన్ని దినములకు రెండవ మారు ఇంద్రుని కోరికకు బలియై శతానందునికి తల్లియైనది. వీరిరాక పోకలను గుఱించియు, తల్లి ప్రవర్తనను గుఱించియు అంజన తండ్రి కెఱింగిపగా, అతడు సహింపలేక భార్యను 'శిలాకృతి' వహించునట్లు శపించినాడు. అప్పుడామె గడగడ వణకుచు బాష్పలోచనయై శాపాంతమును వేడినది. తన సంతానమును ప్రేమతో చూచుచుండుమని అప్పగింతలుపెట్టినది.

ఇట్లు ఈకావ్యమున మొదటిమారు మాత్రమే ఆమెధర్మమార్గాతి క్రమణము చేసినది. పిమ్మట రెండు విడతలు ఆమె ప్రయత్నములేకయే కళంకినిగ చేయబడినది అహల్య యందలి మాతృస్వరూపమును ఈకావ్యము చక్కగా ఆవిష్కరించినది. అహల్యచరితను పేర్కొనిన మరియొక కావ్యము ధరణిదేవుల రామయామాత్య ప్రణీతమగు దశావతార చరిత్రము. విష్ణుమూర్తి మోహినీ రూపమును పొందగా, ఆ సౌందర్యమును చూచి సురాసురులు బ్రహ్మసృష్టిని తక్కువగా తలచినారు. అందువలన అతడు పంతముతో, అధిక ప్రయత్నముచేసి, అఖిలలోక మోహనముగ చిత్రించిన మోహనాంగి అహల్య. ఆమెనైష్ఠిక బ్రహ్మచర్యమునను దపంబునను, మిన్నయైన గౌతమునకు భార్యయైనది. కాని ఆమెపైమోహము పెంచుకొనిన ఇంద్రుడు గౌతముని ఆశ్రమమునకు రాక పోకలు చేయుచుండ, ఆ సమయమున అహల్యను ఆకర్షించుటకు అతడు చేయుయత్నములు, అతనిపై అనురాగముండియు పైకి కనబరుపని ఆమెహావ భావములును ఈ కావ్యమున వివరముగ వర్ణింపబడినవి. చివరకు ఇంద్రుని రాయబారిగ, విశ్వకర్మనందిని యగు మనోరంజని వచ్చినది. అపుడు అహల్య

ఔనౌనే వెలయాలనా యిటుల నీ
  వాడన్ ఖలాచాలుఁ బో
పోనవ్వే రెవరైన విన్న నిటనే
  ర్పుల్ చూపగా వచ్చితో
నానాథుండిది విన్నయంత దనకు
  న్నాకు న్మహాహానిరా
దానావంటి కులాంగనామణికి న్యా
  యంబౌనె యీమార్గముల్.

దశా. చ. ప. 82

అని ముందుగా తన వైముఖ్యమును ప్రకటించినది. తన హృదయము నందియ్యక తనకు తన పతిపైగల ప్రేమను వివరించినది. కాని ఆరాయబారి నిష్క్రమణానంతరము, మదిలో నిద్రించుచున్న కోర్కెలు బుసలు గొట్టుచు లేచినవి. ఆమె పతిని చేరి పదములొత్తుట ప్రారంభించినది. అతడు ఆమె భావమును గ్రహించినాడు. పర్వదిన మని పలికినాడు. 'కోరిక వేళ నాయమని కూటమికల్గి సుఖించు వార లేమేరను నోచిరో' అని తలచుట ప్రారంభించినది. ఇట్లు ఆమె మానసిక పరివర్తన ప్రారంభమైనది. చివరకు గౌతమరూపములో ఇంద్రుడురాగా, అతని చూచి గుర్తించినది. గద్గదస్వరముతో, భీతి, కంపము, తొట్రుపాటును పొంది,

'మేనకనో, తిలోత్తమనో
  మెచ్చగ రంభనో, చంద్రరేఖనో

నేనొక చారురూపవతి నే క్షితిదేవ
వరేణ్య యేలనా పై నిటువంటి ప్రేమ?'

అని ఆతనిని గుర్తింపనటుల, భర్తతో మాట్లాడునట్లు పలికినది. అతడు బలాత్కారము చేయగా, ఎడముగా నిలిచి,

'... నీవు కాపతివి
కాపుని కాటుడ వింతెకాక యా
తరినుని వేషమూ తిది
తప్పక తెల్పుము నాదు భర్తకీ
ఘనమగు ప్రేమగాన నీకుఁ
గల్లలు పల్కి శపింతు ...'

అని జంకెన వాడి చూపులచే గద్దించి పలికినది. చివఱకీతడు **నిజము** పలికి పదములపై వ్రాలగా, అంతటివాడు తన పాదములకు మొక్కుట చూచి అతనికి లొంగిపోయినది. అంతేకాదు. అటు పిమ్మట కామవివశయై, మదవతియై, అప్పుడప్పుడు వచ్చుచుండుమని సంకేతస్థలములను వివరించినది. చివఱకు గౌతముడు ఆశ్రమమునకు తిరిగిరాగా; ఏమియు ఎరుగనట్లు నటించినది. ఆ అమాయికత్వమునకు, జాణతనమునకు కోపించి గౌతముడు 'రఘురాము పదాప్తిదాక మేనెల్లను రాయి గాగ వసియింపుము నిర్జన మివ్వనంబునన్' అని శపించినాడు.

ఇట్లు ఈ కావ్యమున పతిభక్తి పరాయణురాలగు అహల్య ఇంద్రునితో సమాగమము నభిలషించుటకు ఆమె మనస్సునందు గలిగిన మార్పు, క్రమపరిణామము విపులముగ వర్ణింపబడినవి. వరూథినీ సత్యభామలను మించిన వాక్చాతుర్యము ఈ కావ్యమున అహల్య యందు కన్పించుచున్నది.

(సశేషం)

# భీష్ముఁడు

– శ్రీ డా. ఎన్. శ్రీధరరావు.

~~~ss~~~

\* నీ ప్రతిజ్ఞ జనులు నిస్తబ్ధులై విని
భీష్మ మనిరి మిగుల బెగడుపడిరి;
స్వర్గవాసులైన వసువులు మదిలోన
ముదముపడిరి మిగులఁ బొగడికొనిరి.

\*భరతోర్విన్ గురువంశవంశవర్ధనుఁడవై,
ప్రజ్ఞాధురీణుండవై,
నరనాథాగ్రణివై, యనంగ సుమబా
ణచ్ఛిన్నహృత్పద్ముఁడై
పరితాపించెడు తండ్రికై బ్రదుకు స
ర్వస్వమ్ము నర్పించి త
ద్భరమున్ దీర్చినవాఁడ వైన నినుఁ జె
ప్పం గాదు దేవవ్రతా!

\*ఎలజవ్వనం బిచ్చి యలవోకఁ దండ్రికి
ముదిమిఁ గొన్నట్టి యాపూరుయశము,
వన్యమృగక్రీడ బలసిన భుజదర్ప
భాసితుం డైనట్టి భరతు యశము,
శస్త్రాస్త్ర విద్యావిశారదత్వపుఁ గల్మిఁ
బ్రతిలేని జోదన్న పరమఘనత,
సానత్కుమారీయశాస్త్ర శిక్షణ యిడు
పరిణతి నింపారు బ్రదుకు ఘనత,
సురనదీ స్తన్యపానంపు నిరతిశయము
శంతనుం డిచ్చినట్టి ప్రశస్తవరము
ప్రోదిఁ గొనుచుండ నీలోనఁ బూటపూట
వీరలోకాగ్రసరుఁడ వైతౌర భీష్మ!

\*ఏవాఁడు ధనువుతో నిహలోకగంగకు
నానకట్ట విధించె నశ్రమముగ,
నేవాఁడు భార్గవు చేవలంతికిఁ దగ్గ
యీడు జోడై యుద్ధమాడ నిల్చె
నేవాఁడు కందర్ప పూవుటంపఱలకు
లొంగక నిల్చె భూలోకమందు,
నేవాఁడు మృత్యువు నిచ్ఛమైఁ బిలిచి యా
తిథ్యము నిచ్చె సద్గృహియుఁ బోలె,
శరపరంపరలను గృష్ణుఁ గరము గప్పి,
యతఁడు గుప్పించి యెగయగా నాత్మ నెవఁడు
స్తుతులతోఁ దీర్చెనో వాఁడు సూరివినుత!
నీవు గాకెవ్వ రయ్యా! సందీప్తచరిత!

\*దేవత్వం బొకవంక నీ తనువులో
దీపింప రాజన్యతా
భావం బొక్కెడఁ దోఁప నిర్జరుఁడవై
పార్థోత్థయుద్ధాబ్ధిలో
జవమున్ జవ్వనమున్ సమస్తమును బో
శౌర్యంబుఁ బోఁ బుచ్చి చి
క్కువడన్ గల్గుట నీదు తప్పగునె యే
కుల్ మేకులై పొల్పడన్.

\*భారతయుద్ధ మంతటికి
బాధ్యత నీ దని యంచు నీకుఁ గై
వారము సేసి పల్కెదను
భవ్యగుణోత్తర! తప్పు నైపవే;
క్రూరుల ధార్తరాష్ట్రులను
గొండుకవారయి యుండ శిక్షలన్
దీర్చినన్ గులంబునకు
దెక్కలి పుట్టక పోయి యుండెడిన్.

\*పాండవులు ధార్తరాష్ట్రులుఁ బట్టిచూడ
నొక్క రూపైన నీకు నెట్లొదవె నయ్యా!
ధార్తరాష్ట్రులపై నంత దయకుఁ దావు;
విధివిపాకంబు గాకది వేఱె యగునె?

[5 వ పద్యములో సగము శార్దూలము, సగము మత్తేభము నైనది. ఇది రచయిత పొరపాటు కావచ్చును. సం పా.]

— ... —
~~~

## ఆనందలహరి

- శ్రీమతి కె కమలాదేవి

*పొన్న పువ్వుగ విరిసిన పున్నమి నిశ
సుధలు చిందిన మురళికై సుదతిరాధ
మధుర భావజ_లాహిరిన్ మనసు నింపి
రయము మీఱగ యమున తీరమున కేగె.

*కనులు మూసిన పుష్పాలి కలలవేళ
మలయ మారత మెల్లెడ మసలి విసర
చంద్రకాంతులు జలముల సంచలింప
అలలుగా సాగి మురళీ సుఖాస్త్రవళి,

*ఎదను తలవాల్చు రాధకు ముదముగొల్పి
గోటమీటెను కన్నీరు గోప సఖుఁడు
పరమ సంతోషమున రాధ పరవశించె
ఎన్ని జన్మల పుణ్యమో ఎవరి కెరుక

*జీవపరమాత్మలకు నైక్య భావ మదియె
రాధికా కృష్ణ సంగమరక్తి మధువు
రసజగతికి నానందమ్ము రమణగూర్చు
నిత్య నూతన సేవన నిష్ఠ నిచ్చు.

*సుమధురాధర రాధ కేసుకృత ఫలమొ
హరికి ప్రేమైకమై జన్మపరిమళించె
నవ్య వాసంతమై తోచునాడు నేడు
కృష్ణలీలలు కవులకు తృష్ణదీర్చు.

*సర్వసుఖ దుఃఖ భవనాశ చపలగతులు
రాగ మోహాలు రమణీయ భాగరతులు
మానసానంద సిద్ధికి మమతకోరకె
ప్రణయ సన్నిధి రుచులసంప్రాప్తికోరకె,

—...—

## మహాకావ్యము ఏది?

- బులుసు వెంకట సత్యనారాయణమూర్తి ఎం. ఏ., ఎం.పిహెచ్. ఐ.

సాహిత్యమునందలి వివిధ రీతులను స్పష్టముగ వర్గీకరించి చూపుట సులభమైన పనికాదు. కాని వానియందు 'మహాకావ్యము' అనెడి రూపమును గుర్తించి చూపుటకు పెద్ద కష్టపడవలసినపనిలేదు. మదగజమును మిగిలిన భూచర ప్రాణుల కంటె ప్రత్యేకించి చెప్పగలుగు నంత సులభముగ, రాజమందిరమును మిగిలిన సామాన్యగృహముల కంటె వేరుగ గుర్తించగలుగునంత స్పష్టముగ 'మహాకావ్యము'ను మిగిలిన 'సాహిత్యరీతులనుండి వేరు చేసి చూపవచ్చును. మహాకావ్యము అను మాటలో నున్న 'మహా' అనునది ఆకావ్యము యొక్క విపులతను, విస్తృతిని, ఆంతరిక సత్యాతిశయమును మొత్తముగ సూచించుచున్నది. నాటకము, ఖండకావ్యము, భావగీతము మొదలైన కావ్యరీతుల కంటె 'మహాకావ్యము' ఎట్లు వేరగుచున్న దన కేవలము దాని విపులతయే కారణము. అంతియేకాక' మహాకావ్యము' అనునది సాహిత్య ప్రక్రియలయందు విశిష్టము, అతివిరళము అయిన ఒక రీతి. యథార్థము పరిశీలించిన 'మహాకావ్యము లను ప్రశస్తికి అర్హమగునట్టి కృతులు ప్రపంచ సాహిత్యమునందే కేవలము వ్రేళ్ళపై లెక్కపెట్ట దగినన్ని మాత్రమే యున్నవి.

'మహాకావ్య' లక్షణమేమి? దీనిని గూర్చిన చర్చ ఏనాటినుండియో జరుగుచునే యున్నది. దీనిస్వరూప, లక్షణములను గూర్చిన చర్చ పాశ్చాత్యులలో ఇలియడ్, ఒడెస్సి, వంటి మహాకావ్యములను, వాటి ననుసరించివ్రాయబడ్డ గ్రంథములను మాదిరిగ పెట్టుకొని నడచియుండ భారతీయులలో రామాయణ, మహాభారతములను మూలముగ నుంచికొని రచింపబడిన వివిధమహాకావ్యములను మాదిరిగ నుంచికొని నడిచినది. పాశ్చాత్యులలో ఇటువంటి చర్చ 'అరిస్టాటిలు'తో ప్రారంభమైనది. రుద్రనాటకలక్షణమును గూర్చిన చర్చలో నడుమ, 'అరిస్టాటిలు' మహాకావ్యముఖ్యలక్షణములను ప్రాసంగికముగ ప్రస్తావించి యున్నాడు. మనలో మహాకావ్యమును గూర్చిన చర్చ ఇంత ప్రాచీనకాలమున ప్రారంభము కాలేదు. బహుశః ఈ చర్చకు దండి, భామహులే ఆద్యులేమో. *వీరికాలము సుమారు 6, 7' శతాబ్దములు. అటుతరువాత భారతీయలాక్షణికులు మహాకావ్య స్వరూపమును గూర్చి నిరవధికముగ నిర్వచించుచునే వచ్చిరి. కాని పాశ్చాత్యులయందు మహాకావ్యమును గూర్చి నడిచిన చర్చలయందు ఏవిధమైన వైవిధ్యము కనబడుచుండునో అది భారతీయుల చర్చయందు కనబడదు. 'అరిస్టాటిలు' తరువాత పాశ్చాత్య విమర్శకులు మహాకావ్య స్వరూపమును గూర్చియు, దాని పుట్టుకను, వికాసమును గూర్చియు, అంతియే కాక మహాకావ్యమునకును ఇతర సాహిత్య ప్రక్రియలకును గల సంబంధాంతరములను గూర్చియు విశేషమైన రీతిలో చర్చ నడిపి యుండిరి. మన లాక్షణికులు మహాకావ్యలక్షణమును సూత్రీకరించుటలో దాని శరీరమును విడివిడిగ వేర్ప

రచి వ్యాఖ్యానించుటయందు తమ పాండిత్యమును ప్రదర్శించి యున్నారు. మొత్తముమీద మహాకావ్యమును గూర్చిన దృష్టియందుగాని, అటులనే విశ్లేషణయందుగాని తూర్పు, పశ్చిమ లాక్షణికులయందు అల్ప, స్వల్ప సామ్యములున్నను, ఉన్న అంతరము మాత్రము తూర్పు, పడమరల కున్నంత యున్నది.

మనకు సమస్త గ్రంథసముదాయమును సాహిత్యమని పిలుచుటయే వాడుక. సహృదయులకు ఆహ్లాదమును కలిగించునది 'కావ్య సాహిత్యము'. కాని చాల కాలము కావ్యమైనను, శాస్త్రమైనను చాలవరకు పద్యరూపముననే రచింపబడుచుండెడిది. మస్తకమే పుస్తకము కావలసిన నాటికాలమున రచనలన్నియు జ్ఞాపకముంచుకొనుటకు సులభమైన 'పద్య' రూపమునందే రచింపబడ వలసియుండుట అనివార్యము. అంతియే కాదు, సహజమును. ఆకారణమున కావ్యమైనను, శాస్త్రమైనను, పద్యరూపముననే అభివ్యక్తమగుచుండెడిది.

అందువలన 'కావ్యము' అన 'పద్యము' కాదు. 'కావ్యము' 'పద్యము' అను ఈ రెండును సమానార్థక పదములు మాత్రముకావు. ఏలన కావ్యము పద్యరూపమునను రచింపబడవచ్చును. గద్యరూపమునను రచింప బడవచ్చును. వాస్తవమునకు 'కావ్యము'నకుసరియగు వ్యతిరేక పదము 'శాస్త్రమే' కాని 'గద్యము' కాదు ఏకాలమున పద్యము సులభమును, అగత్యమును అయినదో, ఆకాలమున గద్యము వ్రాయు నావశ్యకత అంతగ లేకపోయినది. అంతియే కాదు, గద్యము వ్రాయుట కష్టము అనెడి భావనకూడ ప్రచలితమయినదన్న ఆశ్చర్యము లేదు. లేకున్న 'గద్యం కవీనాం నికషం వదంతి' అనెడి మాట బహుళః పుట్టియుండెడిది కాదేమో. కాని 'బాణుడ'ంతటివాడు 'కాదంబరి' అనెడి మహాకావ్యమును గద్యమున వ్రాసి, కావ్యమనగా కేవలము పద్యరూపమున మాత్రమే కాదు, దానిని గద్యరూపమునను వ్రాయవచ్చును. అని పద్యమునకు సవాలు చేసినట్లుగ సాధించి చూపిన తరువాత గద్య, పద్యముల విషయమై కల భావనలు మార్పు చెందినట్లు కనబడుచున్నది. 'గద్యము' కాని 'పద్యము' కాని నిజమైన 'కావ్యము' అగునది దాని వెనుకనున్న కవిప్రతిభ చేతను మాత్రమే అనునది వెలుగులోనికి వచ్చుట తోడనే గద్య పద్యములను మిశ్రమము చేసి 'చంపువు' అనెడి ఒక ప్రక్రియను కవులు ఆవిష్కరించుకొనుటకు సాధ్యమైనది. 'మహాకావ్యము పద్యాత్మకమైనది' అనెడిరూఢిగతమైన కల్పన క్రమముగ తొలగి మహాకావ్యము పద్యమయము, పద్యమయము, ఉభయమయము' అని లాక్షణికులు అంగీకరించుటకు చాల కాలము పట్టినది. *

---

*మహాకావ్య లక్షణమును గూర్చి 'విష్ణు ధర్మోత్తరపురాణము' నందు లక్షణ నిరూపణ మున్నది. ఈ పురాణ రచనాకాలము క్రీ. శ 500 నుండి 600 మధ్యభాగము అని పలువురు విమర్శకుల అభిప్రాయము. కావున మహాకావ్యమును గూర్చిన చర్చ దండి, భామహుల కన్న పూర్వమే ప్రారంభమయ్యె నని భావించుట కవకాశమున్నది. కాని ఇది 'పురాణ' మగుటచే పురాణముల కాలమును లాక్షణికుల కాలమును చెప్పగలినంతకచ్చితముగ చెప్పుట కుదరదు.

— ... —

## మానవజాతి

శ్రీ యస్. టి. వి. రాజగోపాలాచార్యులు
ఎం. ఎ.

*వాకొన నాఁకటి బాధలె
చేకొన కన్నీటి కథలె 'శివరంజని' లో
కేకల గానమె గా కిల
ప్రాకట కళ్యాణ పథము ప్రజలకు లేదో'

*కళలకుఁ బుష్టిరాదు సుమ
ఖంబులు గావు సమస్యలెల్ల – జీ
వులకు సమైక్య సంఘటిత
పుణ్య పథంబగు పింపబోదు శ్రీ
నిలయము కాదు మేదిని– వి
నీతులు జాతికి నేతలెల్ల క్రొ
వ్వెలుగుల మానవత్వమును
బెంచక యూరకయున్న సోదరా'

*ధరణి నాల్గుదెసల దైన్యలే కనుపింప
భావుకుండు బాధ పడుట చెల్లు
అట్టి వాని తపన మట్టిలో పన్నీరు
ప్రభుత వచ్చి అడ్డు పడక యున్న'

*పాయని కూర్మి వన్యమృగ
పంక్తులునున్ వినువీథిఁ బక్షులున్
హాయిగ సంచరింప దుర
హంకృతి మానవులేల యుద్ధముల్
చేయఁగఁ బూను కొందురు? వ
చింప శుభోదయ మేది జాతికిన్?
ధ్యేయము లేని మాటలకు
తీయఁదనంబులు లేవు సోదరా'



Regd. No. H/Rmy-42. Samalochana 16, September 1981

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

ఆడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.